# అస్పృశ్యతుష్యం

అడిగోపుల వెంకటరత్నమ్

**ADRUSYA KUDYAM**

A VOLUME OF POEMS

Cover Painting : **Srikanth Adigopula**

First Edition : July, 2000

Copies : 1000

Printed at : **Sree Lakshmi Press**
14/2 Arundelpet, Guntur

For Copies : **Prajasakti Book House**
Karl Marx Road
Vijayawada - 520 002 and all its branches.

**Visalaandhra Book House**
4-1-435 Vignana Bhavan, Bank Street
Hyderabad - 500 001 and all its branches.

Author : **Adigopula Venkataratnam**
Nagarjuna University
Guntur - 522 510

Price : **Rs. 25**

# బడబాగ్ని

రెండుసహస్రాబ్దాల సాక్షిగా రెండు శతాబ్దాలకు చెందిన ఈ కవి, కొత్త మిలీనియంలో మనముందు నిలబెట్టిన సరికొత్త మహోదయం ఇదిగో.... సోషలిజం రాల్చిన విత్తనాలతో నారుమళ్ళు పెంచి, విశ్వవినువీధిన అరుణపతాకల్ని రెపరెపలాడిస్తూ ఈయన వేసిన కేకకు– కూత మరచిన రైలు కూపెట్టాల్సిందే, విచ్చుకున్న నిశ్శబ్దం రక్తాశ్రువై జారాల్సిందే. అడ్డుగోడలు ఎక్కడ తలెత్తినా బదాబదలు కావాల్సిందే.

ఈ కవి కలం చేజారిన కాలంమీద వర్తమానమై నర్తించదు, చూపంతా ఉజ్వల భవిష్యత్తుమీదే. ఈ క్రాంతదర్శి కవిత్వంలో "ఉషస్సు వుంది, జలపాతం వుంది, ఆవేదన వుంది, అగ్నిపర్వతం వుంది." కవిత్వంలోని ఆ దూకుణ్ణి ఉత్తుంగతరంగం గానీ, ఉరికే మేఘం గానీ అందుకోలేవు. పడవక్రింద పడి మరణించిన అలకు సైతం ప్రాణంపోస్తుంది ఈయన కలంలోని సిరా. అందువల్లనే అప్పుడెప్పుడో శ్రీనాథుడు క్రాంతదర్శిగా ఈ కవి కవిత్వాన్ని దృష్టిలో వుంచుకునే "అడిగొప్పుల హోరుగాలి" అన్నాడని అజ్ఞానపు బడాయిలు చెప్పను గాని –

*"పిడికిలి బిగించి ప్రజలు*
*మ్మడిగా మన యీ వ్యవస్థ మార్చేదాకా*
*పెడబొబ్బ సింహనాదం*
*అడిగోపుల హోరుగాలి ఆగవు సుమ్మీ"* అని ఆరుద్ర అన్నది చెప్పకుంటే ఎలా?! అందుకే "నాగభైరవ" దృష్టిలో "వెంకటరత్నమ్ కమిట్‌మెంట్ ఉన్న కవి. సమాజం అతని గాస్పెల్."

అడిగోపుల వెంకటరత్నమ్ పలికే పదం, రాసే వాక్యం, విన్పించే సందేశం వృథాపోవు. అవి ఒక ఉద్యమంగా మారి జనపదాలను కూడగడతాయి. మెదడులో విచ్చుకునే ఆలోచనలు మగతలోంచి విడివడే చూపుల్ని మనిషికి అందిస్తాయి. మారని నాణెంతో కక్కుర్తి తీర్చుకునే దగుల్బాజీల సప్తవ్యసనాలను స్వాగతించే సుప్రభాతపు అంధకారంలో జ్వలిత ప్రచండభానుడి వంటి గమనం ఈ కవితకు ఉంది. ఈ కవితాసూర్యుని ఆగమనమూ, జ్వలిత ప్రచండగమనమూ ఎన్నెన్ని వెలుగుల్ని విరజిమ్మాయో?! పదునైన కవితా కిరణాలు అదృశ్యకుడ్యాలను సైతం తాకుతాయి.

*"అందరికీ వొక్కడై అధీకృతుడై*
*అందినంత దోచుకుని దాచుకొని*
*సామ్యవాద నిర్మాణానికి*
*సహజీవన సామరస్యానికి"* అడ్డుగోడలై నిలిచేవాళ్ళను నిలువునా

పాలేస్తాయి! పాడిగా వుంచే తడిగొంతుల ఎత్తుగడలను తుత్తునియలు చేసి అందరికీ నీళ్ళందేట్లు చూస్తాయి. ''మారిన ఇతివృత్తాల మధ్య మారని వ్యథాభరిత చిత్రాలు'' మన కళ్ళకు కట్టిస్తాయి.

ఉత్తర దక్షిణ ధృవాల్ని కరచాలనం చేస్తూ లయబద్ధంగా పరిగెత్తే రైళ్ళు సైతం కంపార్ట్ మెంటుల్లోని అసమానతల అపస్వరాలకు బాధగా మూల్గుతాయి. ఏం చేస్తాం– ''నాణేనికి రెండు నాల్కలు.'' పాములే కాదు, డాలర్లు, పౌండ్లు, దీనార్లు కూడ కాటేస్తున్నాయిగా మనుషుల్ని!

''శ్రామికుని చూపు సౌరశక్తి
పిడికిలి శ్రమశక్తి
సమస్తం దోచిన
ఒకడిది చోరశక్తి'' అయినప్పుడు ఈయన కవితల కొలిమిది చోదనశక్తి కదూ!

''అమ్మతనం కొలవడానికి
అమ్మ ఆవేదన అర్థంచేసుకోడానికి
అమ్మకే సాధ్యం''

అంటూ సిద్ధాంతీకరించి, స్త్రీలవైపు తిరిగి ఈవ్‌టీజింగ్‌కు యింతకాలం వొదిగి వొదిగి తలవంచిన వాళ్ళతో ఛేల్‌మని అవతలి వాడి చెంప వాయింపజేస్తుంది ఈయన కవిత్వం.

''ఏమ్మా! చస్తూ బతుకుతున్నారు
చావును మోస్తూ సాగుతున్నారు
మరణానికి ముందు ఒకే యుద్ధం తల్లీ
అది ముందుతరానికి విజయగీతిక'' అని పలికి స్త్రీవాద నగారా శక్తికొద్దీ మోగించగా బదులిచ్చేందుకు సిద్ధమైన ఈయన తయారీలోని స్త్రీప్రతిమను చూసి ఇంక ప్రశ్నించేదెక్కడ? అంతా పరుగో పరుగు! స్త్రీల అంతరంగాన చైతన్యం రెక్కలు విప్పేట్లు చేస్తుండగా మూడుముళ్ళ సాక్షిగా మూగవేదన ఇంకా కొనసాగేందుకు వీలులేదంటున్నది. అవునూ! ఇది లక్ష్మణరేఖల కాలమా?.... కాదు, కానేకాదు.... సీతమ్మలకు రెక్కలొచ్చిన కాలం. వాళ్ళ రెక్కలకష్టంమీద వాళ్ళకు వాళ్ళుగా బతగ్గలిగిన కాలం. ఇంకా బంగారుజింకల కోసం భర్తల్ని పరిగెత్తించేవాళ్ళుంటే ఎన్ని యుగాలకైనా వాళ్ళ కష్టాలెలా గట్టెక్కుతాయి? అడిగోపుల దృష్టిలో ఎవరి దుఃఖం వారిది కాదు. అది పదిమందీ పంచుకు తీరవలసిందే. పదిగొంతులూ కలపవలసిందే – ఆ దుఃఖాన్ని పారద్రోలేందుకు.

సుమధురస్వరాల సంగీత అవధానాలు ఒకింత ఆలకించినా, మృగ్యమైన మానవ సంబంధాల్ని వెక్కిరిస్తూ చిలిపికన్నుల కన్నయ్యను గేదెవీపు అంబారీ ఎక్కించి గోచిగుడ్డను ముఖమల్ వస్త్రంగా చిత్రించినా, ఈయన కవితలు కాలక్షేపం బఠానీలు కావు.

"తలొంచి తరలిపోతున్న జనావళిని
ఒకేతాటిపై ఉద్యమించమని" చేసిన నినాదాలు

"కోటి వీణల్ని ఒకే శ్రుతిలో పలికించే" ప్రయత్నం. అన్నీ అగ్ని స్నానం చేసిన అక్షరశిల్పాలే. వెంకటరత్నమ్ కవిత –

"మమతానురాగ
చేతనాగేయం
మానవకల్యాణానికి
సమైక్యతా హారం."

అందుకే ఈయన కవిత్వంలో "వర్తమాన సమాజమంతా... కొత్తగా, వెచ్చగా, కారంగా, పరిమళంగా, మట్టివాసనగా, సూచనంగా, సమగ్రంగా యింకా చాలా చాలా వాటిగా" కన్పిస్తుంది స్మృతి సాహిత్యకారుడు రావూరి భరద్వాజకు.

"నాటికీ నేటికీ
నిలగట్టిన నీటిలో
అలలేని జీవితాలై
అణగారిన ప్రజల" కు అలజడి నేర్పుతుంది ఈ కవిత్వం. మునకే ముగింపనుకున్నవాడికి చేపపిల్ల ఎదురీత చూపి కొండంత స్ఫూర్తిని అందిస్తుంది.

"టెలిఫోన్ తీగపై వొదిగిన పక్షికి
కాళ్ళకింద తీగ అనంతభూమండలం" అనే భరోసా నిస్తుంది.

కలవారి ఆనందహేలకు బడుగుబతుకులు బలికావటం చూసి కళ్ళొత్తుకుంటుంది. లేమి నొసట ఉషస్సు ఉదయించాలంటుంది. ఎవరి బ్రతుకుల్లోనూ "ఆకలి వడ్డీ, దారిద్ర్యం చక్రవడ్డీ" కాకూడదంటున్నది.

"బండరాళ్ళు తవ్వి డైనమైట్లు పేల్చి
పట్టుబడ్డ జలధారను నూతిలో పండించి"

అందరి నోటికీ నీరందించినవాడు

"దాహార్తై దోసిలిపట్టి
అస్పృశ్యుడై బావికి
అమడదూరాన" నిలిచే అన్యాయానికి ఊరూవాడా కుతకుత లాడేట్లు చేస్తుంది. ముమ్మాటికీ అది –

''అణగారిన జనం చేతి
అంకుశమై నిలుస్తుంది.''

''నీకెందుకింత అశాంతి? నీకెందుకింత ఆవేశం?'' అని ఈ కవినెందుకు అడగటం? శేషేంద్రశర్మ చెప్పిన సమాధానం వినలేదూ... ''సముద్రాన్ని అడుగు నీ కెందుకింత అశాంతి అని. ఝంఝూమారుతాన్ని అడుగు నీకెందుకింత ఆవేశం అని.''

''తలలు వంచక చేతులు దించక
ఒకర్నొకరు పూడ్చుకోక
పుటంపెట్టుకోక
కులం మరిచి మతం మరిచి
కదంతొక్కి, పదంపాడి సాగితే''

ఎదురొచ్చే వేల సూరీళ్ళ ఉషోదయాన్ని స్వాగతిస్తుందీయన కవిత్వం.

''ఏ యుద్ధం ఎందుకు చేసినా
ఏ పక్షం విజేత కాదు
ఏ యుద్ధం ఎక్కడ జరిగినా
ఇరుపక్షాలకు గుణపాఠం.''

అందువల్ల యుద్ధం రాకుండానే చూసుకోవాలిగాని అంతా అయిపోయిన తర్వాత మిగిలే శాంతి వల్ల ప్రయోజనం శూన్యం అంటాడీయన. ''శాంతిని మింగి జీర్ణించిన అశాంతిని'' చూసి ''అహింసను నెమరేస్తున్న హింసను'' చూసి బుద్ధుడు నవ్వాడంటే నవ్వడూ మరి!

''చేతికర్రపై వాలిన చేతులమీద గడ్డాన్ని కూర్చోబెట్టి'' రైతు తల్లకిందులుగా తపస్సు చేసినా నెర్రెబారిన నేల తడవటంలేదు. అతడికి వర్షాలతో జూదం తప్పటంలేదు. నీళ్ళులేవు సరికదా రైతులకు కన్నీళ్ళుకూ కటకటే. ఉప్పెన ఉప్పునీళ్ళతో కష్టాల కన్నీళ్ళు కలగలిసిపోయి ఉప్పురికిన హృదయక్షేత్రాలను ద్రవీభూతం చేసి నీరందించి ముక్కారు పంటలు పండించాలనే తపన ప్రతి అక్షరంలోనూ కన్పిస్తుంది. ఇటువంటి కవిత్వం తడి తగిలితే –

''అభాగ్యులు అనాథలు
అన్నార్తులు అర్భకులు
మనోనేత్రం తెరుస్తారు
అగ్నిని స్నానిస్తారు.''

“భూమిపై చంద్రుడిపై
గ్రహాలపై గ్రహాంతరాలపై
అడుగులు ముద్రిస్తూ
నేను కవిత్వమై శ్వాసిస్తాను”

అనే అచంచల విశ్వాసంతో ముందుకుసాగే ఈ కవి

“అదునుచూసి పదునుచూసి
వేసిన కోండ్ర చాలు
మరో నిర్మాణానికి పునాది
మరో ప్రారంభానికి ప్రేరణ” అవుతుంది తప్పక. పిల్లి మెడకు గంటకట్టటం ఓనాటి మాట... అది పిరికిమాట... ఎలుకల్ని సంఘటితమై గంటకొట్టి పిల్లిని వెంటాడమంటాడు వెంకటరత్నమ్ సరికొత్త మాటగా. శ్రీశ్రీ బాటలో –

“అలజడి మా జీవితం
ఆందోళన మా ఊపిరి
తిరుగుబాటు మా వేదాంతం
ముళ్ళూ రాళ్ళూ అవాంతరాలెన్ని ఉన్నా
ముందుదారి మాది
ముందుకుపోతాం మేము, ప్రపంచం మావెంట వస్తుంది”

అనుకొంటూ అడుగేసే శ్రీ వెంకటరత్నమ్ దృష్టిలో –

“ఎక్కడో దాగిలేదు స్వర్గసీమ
ఒక ఆకలి తీర్చితే వేయి అమరలోకాలు
స్వర్గానికి దారులు పీడితజన సేవలు.”

అడిగోపుల ఈతరం కవి మాత్రమే కాదు –

తీరుబడి అంతా కవితకై వెచ్చిస్తూ
దానిని ప్రజల దగ్గరకి తెచ్చేస్తూ
అరమరికల్ని దూరంగా తరిమేస్తూ
రగిలే నిరంతర కవి వెంకటరత్నమ్.

ఏ అడ్డుగోడనూ నిలువనివ్వని ఈయన కవిత్వంలో సాహిత్యచైతన్యం, సామాజిక చైతన్యం రెండూ చెట్టాపట్టాలతో చెంగలిస్తాయి. ఈయన కవితలు నెత్తురు మరకలు కావు నెత్తురు మొలకలు.

**– రావెల సాంబశివరావు**

**గుంటూరు**
**1-7-2000**

# శీర్షికలు

# మహోదయం

రెండు సహస్రాబ్దాల సాక్షిగా
రెండు శతాబ్దాల మనిషిని నేను
వడగట్టిన శైశవరేఖల వెలుగులో
తొలిదిక్కు కాన్వాసుపై
శతాబ్దపు ఇతివృత్తాన్ని చిత్రిస్తున్నాను.
రెండు ప్రపంచ యుద్ధాల గుణపాఠాలు
హిరోషిమా నాగసాకి విధ్వంసాలు
పడగెత్తిన ఫాసిజం ఓటమి
గాండ్రించిన గర్జించిన కమ్యూనిజం
అపజయాల నేపథ్యమై రాలిన సోషలిజం.
స్వాతంత్ర్యం జన్మహక్కయి వలసపాలనకు స్వస్తి
శృంఖలాలు తెగి స్వేచ్ఛాఝంఝామారుతం
చంద్రుడు బొమ్మయి చేజిక్కిన చిత్రం
శాస్త్ర సాంకేతికాలు శుక్రుడ్ని తాకిన విజయం.
ఆకసానికి నిచ్చెనవేసిన అభ్యుదయసాహిత్యం
అధఃపాతాళానికి జారిన క్షుద్రశృంగారాలు
పెట్టుబడి వ్యవస్థ జేబుబొమ్మగా ప్రపంచం
బహుళజాతి సంస్థలు పెంపుడుబిడ్డలై ప్రపంచీకరణ.

శ్వేత జాత్యహంకార వివక్షతా పాలన
జాతులన్నీ ఒక్కటై పోరిగెల్చిన గాథ
హింసాదౌర్జన్యాల రాజకీయ రక్తపుకూడు
ఆదమరిచిన వెన్నుపై కుతంత్రాల పోటు
పాలించే ప్రభుత్వాల స్కాముల పరంపర
అంబారీలో ఊరేగే అవినీతి తిమింగలాలు
శ్రమశక్తి అదనపు విలువలు అదృశ్యం
సమస్త దోపిడీకి సర్వ శక్తియుక్తులు నియుక్తం
రైతుల కడగండ్లు దళితులపై దాడులు
ఆకలిచావులు అత్యాచారాలు
రెక్కలు తెగిన స్త్రీ ఆక్రందన
ఉవ్వెత్తు పోరాటాల పరాయీకరణ.
చీకటి ఒకడి తలరాత కాదు
వెలుగు ఒకడి హక్కుభుక్తం కాదు
ముడిలోహం కరిగేదాకా
రూపావిష్కరణ జరిగేదాకా
జీవంతొడిగి నడిచేదాకా
ఉద్యమించి సాధించేదాకా
నే రాస్తూనే వుంటాను.
రాలిన సోషలిజం విత్తులు నారుమళ్ళవుతాయి
విశ్వాంబర వీధిలో అరుణపతాకాలు వెల్లివిరుస్తాయి
ఎదురుచూసే మనకోసం మహోదయ మిలీనియం.

# నిక్షిప్త జీవనది

జడంలోను ద్రవంలోను
చరాచర జగత్తులోనూ
కవిత పారదర్శకంగా నిక్షిప్తం
కదిపితే జీవనదీ ప్రవాహం—
మనసు సుక్షేత్రమై
పారి పరవళ్ళు తొక్కే మాగాణమై
పల్లవించిన చోట
పసిడిరాసుల పంట.
కవిత మేఘమై పరుగెడుతూ
పలకరిస్తూ పరిభ్రమిస్తుంది
మనసు శిఖరమై తాకితే
చినుకుల చిత్తడిలో
జీవన నయాగరా.
సముద్రాన్ని లుంగచుట్టి
ఉత్తుంగ తరంగమై కవిత
ఒడ్డుకు ఉరికినపుడు
మనిషి చెలియలికట్టయితే
పిటిముత్యాల వానలో

నిలువెల్లా మానవత.
ఇంకి ఇంకి కవిత
పాతాళగంగై దాగినపుడు
మనిషి భగీరథుడై
నేలపైకి మార్గం మళ్ళిస్తే
వెలుగు జిలుగుల జాబిల్లి.
స్తబ్ధ హృదికి
సందేశమై కవిత
చలనం పోస్తుంది
అణగారిన జనంచేతి
అంకుశమై నిలుస్తుంది
నీటిలో నిప్పులో
రాతిలో రప్పలో
కవిత నిక్షిప్తం
మనసు చిగిర్చితే మందాకిని.

# జ్వలన రేఖ

కొండల్లో కోనల్లో గుహల్లో
నువ్వు నిల్చినచోటు ఒక వేకువ ఒక చరిత్ర
చేజారిన కాలంపై వర్తమానం వెచ్చించక
శేషాన్ని వజ్రాయుధం చెయ్యడం
బృహత్తర బాధ్యత.
నీలో ఉషస్సు వుంది జలపాతం వుంది
ఆవేదన వుంది అగ్నిపర్వతం వుంది
అన్నీ నిమజ్జనం చేసే చేష్ట వుంది.
జ్ఞానం మరిచిన నేత్రాలు
చూపులకే పరిమితం
నిలకడ నీరై జీవితం అలా అలా
ఇంకిపోవడం చూసి
చలనశీలి సెలయేరు
ఉరికే మేఘం సిగ్గుపడతాయి.
నీటికి ఎన్నిరూపులో....
ఆకృతి మారిన బిందువు
తామరాకుపై మేలిమి ముత్యం.
పల్లపు ప్రాంతాన్ని ఆక్రమించిన ఉప్పెన

పర్వతం వద్ద తలవంచి తిరిగిన మలుపు
నిరాశ నిస్పృహలకు కనువిప్పు.
జీవికి ప్రాణం పోసే ప్రక్రియలో
కీకారణ్యం కనుమలు చుట్టిన నదికి
ఒళ్ళంతా గాయం.
ప్రాణభయంతో పరుగెత్తేవాడికి
ప్రతిదీ మృత్యువాణి
శస్త్రధారణ చేసి అంగరక్షకుల మధ్య నిల్చినా
అస్త్ర ఘాతానికి బలి.
నువ్వు నడిచిపోతుంటావు
అగ్నిశిఖవై—
ఒకరికి కాంతిపుంజం ఒకరికి ఉత్తేజం.
పడవకింద పడి మరణించిన అల
ప్రాణంతొడిగి పయనించడం
మనిషి జీవితకాలం
మనోనేత్రంపై ముద్రించాల్సిన జ్వాలనరేఖ.

# పచ్చని కలల రాగం

మోడువారి మూగబోయి
ఇన్నాళ్ళూ రాగాన్ని ఉగ్గబట్టిన కోయిల
వసంతం పండిన ఒకానొక వృక్షంపై
పచ్చని కలల రాగం పాడుతుంది
వివిధ దిక్కుల హృదయాలు
అటు దృష్టి సారిస్తాయి.
భూమిపై పడ్డ రాగాస్త్రం
చీకటికి వెన్నెలకు
స్నేహమై బంధమై
జనపదమై నాటుతుంది.
రెప్పలు విప్పడం తప్పిదమైనచోట
నోరు విప్పడం నేరాతినేరం
పాలక నియంతకు పాట నచ్చదు
ప్రజల బాట నచ్చదు
నిరంకుశ శాసనం
నిట్టనిలువునా పాటను ఉరేస్తుంది.
గడ్డి మొలవని బీళ్ళు ఎండిన మోళ్ళు
తలల్లేని మొండాలు

చుక్కల్లేని ఆకాశం
నియంతకు ప్రీతిపాత్రం.
అందర్నీ కన్న అవనితల్లి
తన్ను తాను పోగొట్టుకునే వేళ
అంబులపొది అందుకుంటుంది.
నియంత నేల కొరుగుతాడు
పచ్చని కలను మోసుకొచ్చి
కోయిల గొంతెత్తుతుంది
మరణం లేని మట్టి
కోయిలకు తోడౌతుంది.

# ప్రవాహిని

జీవం తెగి వర్తమానం
ఆ ఇంటి వేలాడుతూ తోరణాలు
ఎంతకూ ఎండిన పొయ్యి రాజుకోదు
ఎసరు పైకెక్కదు
కాలం పరుగును కొలుస్తూ
గడియారం నడుస్తూంది.
అంతవరకు ఉయ్యాల్లో కేరింతలేసిన
పసిబిడ్డ మగతగా నిద్ర.
కడుపు ఎండిన
రామచిలుక స్వాగతం మరిచి
గూట్లో నిశ్శబ్దం.
గింజలేని వరికంకుల్ని చూసి
వాకిట పిచ్చుకలు ఒకటే రొద.
పొద్దెక్కినా పలుపులు విప్పని
పశువుల దప్పిక చూపులు.
తల్లిపాల కోసం
మోరెత్తి నిల్చిన లేదూడలు.
వేళ మారినా రాని చద్ది కోసం

మడి ఎదురుతెన్నులు.
కారణం అమ్మ లేవలేదు
అస్వస్థత అమ్మను లేవనియ్యలేదు
మూసిన కన్ను తెరవాలని
అమ్మ ఎంత యత్నించినా
కనురెప్పలు కంటి ఆధీనంలో లేవు
అమ్మతనం కొలవడానికి
అమ్మ ఆవేదన అర్థంచేసుకోడానికి
అమ్మకే సాధ్యం
అమ్మను కన్న అమ్మ వుంటే బాగుణ్ణు
అమ్మకన్న అమ్మయినా బాగుణ్ణు.

# సదా కృతజ్ఞుడ్ని

నారుకయ్యలా ఇంటినిండా జనం
ఒక్కరూ నిద్ర లేపలేదు
నిద్రలేవని వారు అలా వుండిపోయాక
లేచినవారు ఎవరికి వారు
ఎటో వెళ్ళిపోయాక
నేను నిద్రపోతూనే వున్నాను.
నీ రూపం పహరా కాసి
నీ మాటలు కట్టడిచేశాయి
నడిచి వచ్చిన మేర వెనక్కు నడిచాను.
ఐశ్వర్యం యిచ్చిన అహంకారం
నిన్ను ఆటపట్టి వేధించింది
విషక్రీడ ఈవ్ టీజింగ్
విజయవిహారం చేస్తున్నప్పుడు
వొదిగి వొదిగి తలవంచిన నువ్వు
కాళివై మహంకాళివై
ఛెళ్ళున పేల్చిన చెంపదెబ్బకు
నా దర్పం దౌర్జన్యం భూస్థాపితం.
నేల నా పాదాల్లోకి

నేను నేలలోకి ప్రవహించాం
అదో జీవధార
రాగరంజిత చేతనాస్పర్శ
రాతికి గుండె వుంది
గుండెకు గుబులు వుంది
నీటికి నృత్యం వుంది
నృత్యానికి పాట వుంది.
నువ్వు పగలేసిన చెంప
అతుకేసుకున్నాను
వాకిట వేలాడదీశాను
గాయం మాని మచ్చ మిగిలింది
ముమ్మాటికీ నేనిప్పుడు మనిషిని
ఇక ఎప్పటికి మారిన మనిషినే —

# కూత మరిచిన రైలు

ఎండిన పెదాల మధ్య
బొటనవేలే పాలపీకగా తమ్ముడు
ప్రాణం నిముషాల్లో కొలుస్తూ
కాలం వెళ్ళదీస్తున్న అమ్మ....
నిల్చినా నిద్రించినా
ఆ పాపకు సజీవచిత్రాలు.
పచ్చని మైదానాలు పంటపొలాలు పాకి
ఏడ్పులు ఎడారులు తాకి
ఆగిన రైలు ఒడికి చేరిన పాప
పాటగా రూపెత్తుతుంది
"ఎక్కడో దాగిలేదు స్వర్గసీమ
ఒక ఆకలి తీర్చితే వేయి అమరలోకాలు
స్వర్గానికి దారులు పీడితజన సేవలు
ఎక్కడో దాగిలేదు స్వర్గసీమ"
పాటను రైలుపెట్టె ప్రతిధ్వనిస్తుంది
మైమరిచిన రైలు
కూత మరుస్తుంది.
ఉలిక్కిపడ్డ నిద్రలు ఉబుసుపోని కబుర్లు

పిసినిగొట్టు మనసులు కసాయి రాతిగుండెలు
పాటలోకి ప్రవహించి
అసంకల్పితంగా నాణేల్ని వెతుకుతాయి.
పాట చేయిజాస్తుంది
ప్రతిఫలం అర్థాకలి
ఆగిన రైలుబండి ఒడిలోంచి
పాట ఆగి దిగుతుంది.
ప్రతిస్పందించిన రైలుపెట్టె
పాటను వెతుకుతుంది
కనిపించని పాప కోసం
కంటిచూపులు వలసవెళ్తాయి
మైమరిచిన రైలు
మరుస్తుంది కూత.

# మూగజీవి మౌనభాష

పల్లెచుట్టూ నా పంచప్రాణాలు ప్రదక్షిణం
నా ఉన్నతే తన అస్తిత్వమని చాటుతుంది.
పంటకాలువలో నిశీథివేళ
నీటినిండా చంద్రుని పంట
పచ్చని పొలాలపై తివాసీలు పరిచి
పిండారబోస్తుంది రేయెండ
పైరగాలి పొలాలపై వాహ్యాళి
చెట్లు కోతికొమ్మంచికి పిలుపు.
చెడుగుడు ఆటలో పట్టుబడ్డవాడి
పెనుగులాట చూసి భూదేవి బాధపడ్డా
పట్టువదలని విక్రమార్కుడై ఎల్లదాటి గెలుపు
గ్రీష్మంలో పొలాలు క్రీడాస్థలాలై
బిళ్ళంగోడుకు ఆహ్వానం
పల్లెచుట్టూ గాలిపటాల పక్షుల్ని చూసి
సాగే మేఘాలు ఆగి చూసిన చోద్యం
ఇంటింటా పంటరాసులు
పొలాల్లో రాల్చిన శ్రమజల ఫలాలు.
మనసుకు హత్తుకునేది

మళ్ళీ మళ్ళీ జ్ఞప్తించేది గోధూళి దృశ్యం —
పచ్చికబీడు వీడ్కోలు
పల్లె స్వాగతం మధ్య
· గేదెవీపు అంబారీ
తలగుడ్డ కిరీటం
ఈతపుల్ల పిల్లనగ్రోవి
గోచిగుడ్డ ముఖమల్‌వస్త్రమై
చిరునవ్వులు చిందిస్తూ
చిలిపికన్నుల చిన్నికన్నయ్య ఊరేగింపు —
గేదె పట్టపుటేనుగై
మందగమనపు అడుగుల చందం.
కన్యలు గోపికలై ఊరబావి వద్ద
బాలగోపాలుడితో పరిహాసకేళి
మర్నాడు మళ్ళీ మురళీధరుడై
అంబారీపై తరలి వస్తున్నట్టు
కన్నయ్య అనుభూతి
మృగ్యమైన మానవ సంబంధాల్ని
నెమరేస్తూ మూగజీవి మౌనభాష.

# స్వరమాలిక

పరవశించి తుళ్ళిపడ్డ మనసు
నదీతీరాన పరుగులు
కొండల్ని ప్రతిధ్వనిస్తూ
కేరింత శబ్దం
పరుగు హఠాత్తుగా
లంగరేసిన పడవ
నది నోట్లో అలల నాలుకలు
సుమధుర స్వరాల
సంగీత అవధానాలు
కరకట్టను ముద్దాడిన
నాట్యకేళీ రవణులు —
ఎవ్వరూ నేర్వని
ఎక్కడా అభ్యసించని కచేరీలు
యుగయుగాలుగా
ఈ స్వతస్సిద్ధ సంగీతం
అన్ని సంగీతాలకు ఆదిమూలం.
పియానో పిల్లనగ్రోవి
ప్రాకృతస్వరం ముందు కృతకం

అసహజ బాణీల కుప్పిగంతులు.
హృదిలో సహజ ప్రసాదిత
సంగీతాన్ని నింపి
రాత్రింబవళ్ళు నెమరేసుకుంటాను
సాగిపోయే సంగీతంతో పాటు
మనసూ తనువూ పరుగుపరుగై
కరకట్టన కూర్చొని
అందెలసవ్వడి జోడిస్తాను
అలల పాటల మధ్య నా రూపం
శిల్పి చెక్కని శిల్పం —

# జవాబు చెప్పాల్సివుంది

సముద్రాన్ని నమ్మి సాగుతుంది నౌక
విఘ్నమై ఎదురుగా మంచుకొండ
నింగిపై భరోసాతో
ఎగురుతుంది విమానం
అభిముఖమై జీరకళ్ళ డేగ
వసుధపై విశ్వాసంతో
పరుగెత్తుతుంది రైలు
కాళ్ళకింద అవిశ్వాసమై డైనమైట్.
నమ్మకం అపనమ్మకాల
రెక్కవిప్పిన పరుగులో రెప్పపాటు
అప్రమత్తత ఇప్పుడు లెక్కిస్తున్నాను.
ఛిద్రమైన కాలం
గంటలు నిముషాలుగా అమ్ముడయ్యాక
బ్రతుకు పలురూపాలై బ్రతకమంది
ఒకానొక నా చీకటి తప్పు
నత్తు నాణేనికి హక్కుదారైంది
కప్పు కాఫీకి మనసు ఉవ్విళ్ళూరి
చూపుచేతిలో దూరి ఆశ చంపుకుంది

అపహాస్యం గేలిచేసింది.
కప్పు కాఫీతో నాణెం
తులాభారం తూగదు
నాణెం మారదు గాక మారదు.
అవసరం తీరినవాడి అయివు వుండదు
నాణెం తాలూకు గాయం
సలుపుతూ వుంది
తలిస్తే ఒంట్లో అణువణువూ
వాంతి చేస్తూంది
నా చేతి నాణెం ఎప్పటికీ మారదు.
ఉషస్సులు తమస్సులై
వక్రించిన చిరునామాలకు
చరిత్ర జవాబు చెప్పాల్సివుంది.

# నిర్మాణానికి పునాది

ఎండ సముద్రాల్ని నెత్తికెత్తుకున్న చెట్లు
రహదారిపై పండించిన నీడ తునకలు
మజిలీ నడకకు మానసోల్లాసాలు —
గొంతెండిన పాదాలకు
చలివేంద్రాల స్వాగతం
సమస్తం అమరిన బాటపై
పల్లకీ ఊరేగింపు ప్రత్యేకత లేదు.
క్రూరమృగ గర్జనల గాండ్రింపుల మధ్య
భీకరారణ్యాన కదలడమే నడక
కత్తెరరాళ్ళు సిందూర మడుగుల మధ్య
చేతుల్తో దేకడమే నడక
నిప్పుకణికలపై చెమ్మంటని పాదాలదే నడక
అగాధమౌ జలనిధిపై
అలుపెరుగని పరుగే ప్రయాణం
ప్రతి నడక ఓ చిత్రలేఖనం.
హిమాలయ ఉత్తుంగ శిఖరానికి
ప్రప్రథమ రాదారి టెన్సింగ్
సముద్రాల అంచులు కొలిచిన కొలంబస్

మరపురాని మహాపథికుడు.
కేవలం విరగబడి కురిసిన వెన్నెల
బతుకు క్షేత్రాన వెలుగుపంట కాదు
చీకట్లో చీకటి.
అదును చూసి పదును చూసి
వేసిన కోండ్ర చాలు
మరో నిర్మాణానికి పునాది
మరో ప్రారంభానికి ప్రేరణ.

# మనిషి చిరునామా దుఃఖం కాదు

ఒకటే భయం ఏదో పిరికితనం
నరాల్లో వొణుకు ఘనీభవించిన దుఃఖం
ఎవరో తల నరికి వేలాడదీస్తున్నట్టు
జలసమాధి చేస్తున్నట్టు
భూస్థాపితమై అంతా ఐపోయినట్టు —
నేను పారిపోతాను గుహల్లో దాగుతాను
గూళ్ళలో వొదుగుతాను
అక్కడా అదే కర్త కర్మ క్రియ
ఒక యుద్ధభూమి ఒక పద్మవ్యూహం
ఒక రాజ్యాంగేతర చర్య
నను వీడని నీడ.
వొదిగి వొదిగి వొదగలేకపోతాను
నాలో ఏదో విచ్చుకుంటున్న ఆలోచన
మగతలోంచి విడివడుతున్న చూపు.
మనఃఫలకంపై కదలాడుతూ చిత్రాలు
లంకంత ఓడ అడ్డంపడ్డా
ఒరుసుకుని ముందుకు ఉరికే అలలు
సమూహాలకు సమూహాలై వలసవస్తూ

ఆకాశం అంచున పక్షులు
చలిచీమల మధ్య
చరమాంకం పాడుతూ సర్పరాజు.
ఇన్నేళ్ళూ పలాయనం కప్పుకుని
నన్ను నాలో గుర్తించే ప్రక్రియే లేదు
మనిషి చిరునామా దుఃఖం కాదు
పరాయీకరణ ఎత్తుగడసూత్రం కాదు
మనిషి ఎన్ని లావాలు ఎన్ని బడబాగ్నులు
ఎన్ని అగ్నిముఖాలు ఎన్ని వజ్రాయుధాలు
చేతిలో ఆయుధం వుండీ నిరాయుధుడు.
ఇంటి తలుపుల్తో పాటు మనసును
కనురెప్పల్తో పాటు గొంతును విప్పితే
మనిషి ఒక్కడు కాదు
సమూహాల సముదాయం.

# తిరగబడ్డ గాయం

ఎన్ని రూపాలు ఎన్ని అవతారాలు
మూలవిరాట్టు చుట్టూ ఎన్నెన్ని ప్రదక్షిణాలు
కార్లు షేర్లు సమ్ముఖమై నిల్చి
ఒంటరిగా నీ కట్టెను
వల్లకాటికి సాగనంపుతాయి
మరుభూమిలో నీ వెంటనంటి
మట్టినిచేసే నమ్మినబంటును
కపాలమోక్షదాత కాటికాపర్ని.
ఎన్ని వేషాలు ఎన్ని పునర్జన్మలు
బండరాళ్ళు తవ్వి డైనమైట్లు పేల్చి
పట్టుబడ్డ జలధారను నూతిలో పండించి
నీ నోటికి నీరందిస్తాను
దాహార్తినై దోసిలిపట్టి
అస్పృశ్యుడనై బావికి
ఆమడదూరాన నిలుస్తాను.
పాలబుగ్గల వయసులో నీ పాదాలు
నా పసిగుండెల పొత్తిళ్ళు దొర్లుతాయి
పెరిగి పెద్దయ్యాక

ఎండిన కండల్తో కందకుండా
చెప్పుల కవచమై నీ కాళ్ళు కప్పుతాను.
పొలంలో దమ్మును గరిసెలో పంటను
అర్థాకలి మంటను
మానవుడికి మాధవుడికి
నిషిద్ధజీవిని
నీకు నేను సింహాసనమై
నిండు పట్టాభిషేకం.
మారిన కథ మాట్లాడుతున్నాను
ఆరెకు చెప్పు సంజాయిషీ యిస్తుంటే
వాడవాడంతా రాజుకుంటూ వుంది
పడుగుపేకల్ని నాడి ప్రశ్నిస్తుంటే
చాకిరేవు బట్టను నిలదీస్తూంది
కర్రు కొలిమికి ముద్దాయిగా నిల్చివుంది
ఊరూవాడా కుతకుతలాడుతూ వుంది.

# ఓ చిత్రం గీయనా

ఎండుటాకు మార్కండేయుడై
తల్లిచెట్టు పాదాల్ని కౌగలించుకుంది
గాలి ఉధృతమై ఆకు శరీరాన్ని ప్రకంపిస్తూంది
కదలని ఎండుటాకును కోపించి
గాలి పలుగై పెకలింపజూస్తూంది
ఎండుటాకు స్థానభ్రంశానికి
గాలి విఫల విశ్వప్రయత్నం.....
చూసిన అర్భకుడి మదిలో
పోగైన వెయ్యి టన్నుల ఆత్మస్థైర్యం.
పక్షులు ఒక నిముషం
అంబరాన అర్ధచంద్రాకారమై
మరో నిముషం సరళరేఖై
భూమికి పంచిన మనోహర దృశ్యాలు
వసంత స్వప్నాలు.....
చూసిన పరాజితుడి ఆత్మవిశ్వాసం
ఆకాశం అంచుల్లో సంచారం.
ఉప్పెనై పొంగిన నదికి వినమ్రమై నమస్కరించి
నీరసించిన నీటిమట్టంలో

నిటారై నిల్చిన మొక్క
ఎవ్వరూ నాటి పెంచని
నది నొసటి తిరునామం.....
అధైర్యం కప్పుకున్నవాడికి
ఆత్మహత్యావలయ సంచారికి
ఆ చిత్రం కొండంత సందేశం.
ఉత్తుంగతరంగాల
రెక్కల్ని విరగ్గొడుతూ
మహోద్ధృత మహానదిని
అవలీలగా చేపపిల్ల ఎదురీదే దృశ్యం
నిరాశలో స్నానించి
మునకే ముగింపనుకున్నవాడికి
స్ఫూర్తిదాయకం
మార్గదర్శకం.

# విజయ గీతిక

వాడికి ఎన్ని రూపులు ఎన్ని బిరుదులు
ఎన్నెన్ని కీర్తికిరీటాలు మరెన్ని రక్షణకవచాలు
వాడు మగాడు మగమహారాజు
పురుషాధిక్య సమాజం వాడి నిర్మాణం
ఛేదనకు ఖేదనకు చెదరని కుడ్యం.
తన స్వేచ్ఛకు తానే తీర్పరి
జూదరై పోనీ మధువై తూలనీ
అహంభావమై పొంగనీ వరకట్నమై వెలగనీ
వాడికేం వాడు పురుషోత్తముడు
పున్నామనరకం సృష్టించి
పుత్రుడై వెలుగుతాడు
రారాజై రాజ్యమేలుతూ
రావణుణ్ణీ మరపిస్తాడు.
ఆమెకు ఎన్ని పేర్లు ఎన్ని రూపకల్పనలు
ఎన్నెన్ని ప్రతిబంధకాలు మరెన్ని శృంఖలాలు
ఆమె అబల అందాలబరిణె
మేలిమి బంగరుమొలక
అంతా కలిసి ఆటబొమ్మ.

ఆమె స్వేచ్ఛకు అతడు నిర్ణేత
పతియే ప్రత్యక్షదైవం
గృహమే బందిఖానై
మగాడి పంచన
ప్రాణం పోసిన పాలరాతిబొమ్మ.
పురుషాధిక్య భగవద్గీత
ఇంటింటా నిరంతర ప్రవచనం
ఆమె మెదడు అతని స్వాధీనం
అతడు ఆమెకు ఆలోచన.
ఆమె పల్లవించి వెల్లివారిందా
పురుషాధిపత్యం వేయిన్నొక్కముక్కలు.
ఏమ్మా! చస్తూ బతుకుతున్నారు
చావును మోస్తూ సాగుతున్నారు
మరణానికి ముందు ఒకే ఒక యుద్ధం తల్లీ
అది ముందుతరానికి విజయగీతిక.

# రోబోట్ పాప

పసిబిడ్డలు వేగుచుక్కలై
కోడికూతకు సుప్రభాతం
నిద్రపోనీండి నిద్రపోనీండి
హాయిగా నిద్రలో నవ్వుకోనీండి
అద్దాల బిడ్డల్ని అర్ధాంతరంగా లేపి
అలారానికి మేల్కొల్పు పాడనీకండి.
పుట్టిన బిడ్డకు
వీధివీధిన కాన్వెంటు బందిఖానా
మొగ్గలాంటి మెడకు టై
పగ్గమై బిగిస్తుంది
వెన్నెలాంటి వొంటిని
దట్టమై యూనిఫాం బంధిస్తుంది
వింధ్యపర్వతం బరువు
వెన్నుపై వెలుస్తుంది
వేషమేమిటో తెలియదు
వేషమెందుకో తెలియదు
కసుగాయ చూపు స్థిరత్వం దిద్దలేదు
పసిమెదడు ఆలోచనదాల్చలేదు.

పాఠశాల ట్యూషన్ల మధ్య
పసిమనసుల నియంత్రణ
పసిబిడ్డ పలికే ప్రప్రథమ పదం
ఎ ఫర్ యాపిల్
ఎంసెట్ హద్దుగా యుద్ధానికి సిద్ధం.
బొమ్మాబొరుసుల కలయికే
నిండుమనిషి రూపావిష్కరణ
స్పందన సృజన
చేతన ఆస్వాదన కొరవడి
రక్తసంబంధ బాంధవ్యాలు
మాసిన మానవతా విలువల మధ్య
మనిషి పెరగని మనసు ఎదగని
యాంత్రిక రోబోట్ పాపల తయారీ.
ధనార్జన ధ్యేయమైన చోట
పసికందు పల్లవించదు
పసిబిడ్డ ప్రపంచానికి మాటలు నేర్పే తండ్రి.

# స్ఫూర్తి మూర్తీభవించినప్పుడు

తరతరాల తపఃఫల
స్వాతంత్ర్యమా స్వాగతం
వయసు మళ్ళిన నీ ఒళ్ళో
మనసు పెరగని మేం కూర్చున్నాం
సతీ అరుంధతివై క్షమించు.
మొగ్గను బెదిరించి
పూయించే దౌర్జన్యం
కోయిల్ని బంధించి
కూయించే అవివేకం
తిమిరం ఉప్పెనై
మేటేసిన అజ్ఞానం.
ఒకడు కాలాన్ని తొడుక్కుని
ఒకడు కాలాన్ని మోసుకుని
ఒకడు భూమిని తిప్పుతూ
ఒకడు భూమిని చుట్టుతూ పయనం.
ధరణి సస్యాలయం
తల్లి రత్నగర్భ
శ్రామికుని చూపు సౌరశక్తి

పిడికిలి శ్రమశక్తి
సమస్తం దోచిన
ఒకడిది చోరశక్తి
మనసు ముసుగై
మౌనం కుంభవృష్టి
గుడిసెలు కూలుతున్న చప్పుడు
భవంతులు లేస్తున్న నిశ్శబ్దం
ఒకడి శిరస్సు
ఒకడి పాదానికి రహదారి.
ప్రభుత్వం వుంది
పీడకుని రక్షణ కోసం
చట్టం వుంది
పీడితుని పీడన కోసం.
నిశీథి ఉషోదయమా
తొలిపొద్దుని అడ్డిన చక్రం
తొలిగి పోతుంది
ఓ స్ఫూర్తి మూర్తీభవించినప్పుడు.

# ఆగమనం ఆగదు

నడక లక్ష్మణరేఖ
బతుకు బందిఖానా
అర్ధరాత్రి స్త్రీ నడక
స్వాతంత్ర్య సంకేతం కాదు
పొడారిన గొంతుకు
నీటిబొట్టుకై దేవులాట.
నిన్నటి విషాదం నేటి స్మృతి
నేటి దుష్కృతి రేపటి సంక్షోభం.
తల్లి మెడలో నెత్తావి
పూదండ ఒకడు
తల్లి జడలో దుర్గంధ
మాలిక ఒకడు
సప్తవ్యసనాలకు
సప్తస్వరాల స్వాగతింపుల మధ్య
తల్లిభారతికి సుప్రభాతం
జ్వలిత ప్రచండభానుని ఆగమనం.
తిమిరాసురుడ్ని
ఏడుకట్ల సవారి ఎక్కించి

ధరిత్రిపై ధవళవస్త్రం పరిచి
క్షితికి అతడు ఉపశాంతి.
నేలపైబడ్డ నీటిబొట్టు ఇంకేలోగా
అతడి ఆగమనం
పురిటి రక్తాన్ని వెలుగులో రంగరించి
ఆరిన బొట్టును తడిగా మారుస్తాడు
అతడి ఆగమనం ఆగదు
ఆ గమనమూ ఆగదు.

# మలిపొద్దు జ్ఞానోదయం

ఒక యుద్ధం జరుగుతుంది
రెండు ఎడారులు ఏర్పడతాయి
శ్యామలసస్యంపై సిందూరం పారి
గరిక మొలవని రుద్రభూమి.
కురుక్షేత్రం యిచ్చిన రక్తక్షేత్రం
నాగులేటిన పారిన పల్నాటి రక్తం
ప్రపంచ యుద్ధాల నరమేధం
కార్గిల్ నజరానా మంచుశిలలు
ఏ యుద్ధం ఎందుకు చేసినా
ఏ పక్షమూ విజేత కాదు
ఏ యుద్ధం ఎక్కడ జరిగినా
ఇరుపక్షాలకు గుణపాఠం.
అన్యాయాన్ని అన్యాయమన్నచోట
అధర్మాన్ని అధర్మమన్నచోట
రక్తసంబంధం చిట్లుతుంది
ఆప్యాయత పగులుతుంది
మైత్రి నెర్రిబారుతుంది
అంబులపొదిలో ఆయుధాలు

ప్రత్యర్థులై పొడుచుకుంటాయి.
శకటాలు కూలిపొయ్యాక
సైనికగణం ఖండఖండాలయ్యాక
పసుపుకుంకుమలు నీలాటిరేవు చేరాక
పసిబిడ్డలు నోరెండి సొమ్మసిల్లాక
పిలిచిన పేరంటమై శాంతి నట్టింట కూర్చొని
మైత్రీబంధమై వైరిపక్షాల్ని కలుపుతుంది
ప్రేతభూమిలో కళేబరాల్ని ఏరుకుని
గెల్చినవాడి ఓటమి గెలుపునాడు ఆరంభం.
మలిదశ జ్ఞానోదయం
తొలిదశలో ఆవిర్భవిస్తే
శాంతి ఎప్పుడూ
వాకిట పచ్చతోరణం
స్నేహ మెప్పుడూ
చేతులు వీడని స్పర్శ.

# నిలవ నీటి జీవితం

మొన్నటి ప్రస్థానం ముగిసింది
కోటలు అగడ్తలు
ముట్టడులు దండయాత్రలు
పరదేశీ చొరబాట్లు
కుట్రలు కుతంత్రాలు
నిద్రించే రాజుల హత్యలు
వెనుదిరిగిన వీపున పోట్లు —
నర్తనశాలలు జలక్రీడలు
నాట్యకేళీ విలాసాలు
అంతఃపుర ప్రేమపురాణాలు —
మధ్యన రోగాలు రొష్టులు ధరించి
ప్రజల ఆకలికేకలు.
నిన్నటి ప్రయాణం సమాప్తం
నవరత్న ఖచిత కిరీటాలు
అంబారీలు స్వారీలు
యుద్ధాలు సంధిమార్గాలు
విషప్రయోగాలు
రాజ్యవిస్తరణ కాంక్షలు

రణన్నినాదం
రణరక్తప్రవాహం —
మేఘసందేశాలు
స్వయంవరాలు —
ప్రక్కన ప్రజల
ఆకలిదప్పుల పరుగులు.
నేటి యానం సాగుతూంది
నాయకులు వినాయకులు
నీతిని మింగిన సుభాషితాలు
హత్యలు దోపిడీలు
పదవులు పైరవీలు
ఏడు తరాలకు ఆస్తులు —
సమశీతల అంతఃపురాలు
ఏడంతస్తుల మేడలు
ముచ్చటైన ముగింపుగా
జనగణమన గీతం —
దారిద్ర్యరేఖ దిగువ
ప్రజలు తచ్చాడుతూ వేళ్ళాడుతూ.
నాటికి నేటికి
నిలగట్టిన నీటిలో
అలలేని జీవితాలై
అణగారిన ప్రజలు.

# అదృశ్య కుడ్యం

భూగర్భజల సముదాయం అవిశ్రాంతమై
ఏడు నిలువుల నుయ్యిని నింపుతుంది
నలుదిక్కుల సాగివచ్చిన నీటిని స్వాగతిస్తూ
రాత్రి శివజాగారం చేసిన బావి
ఉదయం బారులుతీరిన
ఇంటింటి చేదల సేదతీరుస్తుంది.
మనుగడకు అంకితమైన
నిస్వార్థ సేవాక్రియ అది.
కొమ్మరెమ్మల గూళ్ళలో ఆకుపొత్తిళ్ళు పరిచి
పక్షిపక్షికో ఇల్లు ప్రసాదిస్తుంది చెట్టు
నిద్రలేచిన పక్షుల్ని సాదరంగా సాగనంపి
మలిసంధ్యలో మళ్ళీ పాన్పుకై ఆకులు
మంచుబిందువుల్లో స్నానిస్తాయి.
భిన్న జాతి వర్ణ సహజీవనానికి
చెట్టు నిలువెత్తు ప్రతీక.
శైత్యంలో స్తంభించిన గాలి
తొలిసంధ్యలో తేలికపడి
జీవరాసిని అక్కునజేర్చి

మేఘసందేశాన్ని మోస్తుంది
రవి గాంచని చోటును గాలించి
అణువణువుకూ పంచిన గాలికి
ధరిత్రి శ్రేయస్సే ధ్యేయం.
ఆకాశ వ్యాసరేఖపై
కర్షకసూర్యుడు నడుస్తూ విత్తుతాడు.
అందర్నీ సమభావాన స్వీకరించి
పండిన సంపద సమంగా
పంచుకోమని ప్రబోధించి పశ్చిమబిలంలో
రేపటి ఉదయానికి మజిలీ వేస్తాడు.
శక్తియుక్తుల బలిష్ఠుడొకడు
అందరికీ వొక్కడై అధికృతుడై
అందినంత దోచుకుని దాచుకుని
సామ్యవాద నిర్మాణానికి
సహజీవన సామరస్యానికి
అడ్డుగోడై నిలుస్తాడు
నేనే ఆదర్శమంటాడు.

# ఉషస్సు లేని తపస్సు

తపస్సు అక్కడ ముహూర్తంపెట్టని దినచర్య
అరణ్యాలుండవు పద్మాసనాలుండవు
క్రూరమృగాలుండవు కందమూలాలుండవు
ఓంకారనాదాలుండవు
తపోభంగానికి ఇంద్రప్రేరిత
శృంగారభరిత నాట్యాలుండవు
అంతా ఖేద నిర్వేద కర్షకజన తపస్సులు.
చేతికర్రపై వాలిన చేతులమీద
గడ్డాన్ని కూర్చోబెట్టి
నెర్రెబారిన నేల బక్కచిక్కిన గొడ్ల మధ్య
హాలికుల
వేదన ఆవేదన సంవేదనా తపస్సులు.
వమ్మైన శతాధిక నమ్మకాలు
మొలకెత్తి రేకెత్తించే ఆశలు.
చుట్టపుచూపుకో పెళ్ళిచూపుకో
మరో శుభాశుభ చూపులకో
తరలివచ్చిన మేఘాలు
ఎండవేడిమికి వొళ్ళు కాలి

ఆకాశపు అంచుగూళ్ళలో దాగుతాయి
చూపులకందని చిరునామాలవి.
తీక్ష్ణ సూర్యతాపానికి చిర్రెత్తిన సముద్రం
సూర్యుడ్ని తడిముద్ద చేసే యత్నంలో
పొంగి..... ఉప్పొంగి
అందని సూర్యుడిపై ఆగ్రహం
అందిన రైతుపై జలప్రళయం.
అతివృష్టి అనావృష్టుల్ని పాపఫలానికి జమకట్టి
పన్ను లెవీల పెనుభారం యథాతథం.
పంచభూతాలు పంచప్రాణాలు
పంచగంగల సాక్షిగా
నెర్రెబారిన నేల తరచుగా తడుస్తుంది.....
కర్షకుడి కంట కన్నీరు పారితే.

# పున్నమి చీకట్లు

కల ఆకాశాన హరివిల్లయి
అలరారే వేళ
ప్రతిధ్వనించిన రెండు కొండల సాక్షిగా
నినదించిన గొంతు
బూటకపు ఎన్‌కౌంటర్.
అతడ్ని ఒడిచిపట్టిన చెట్టు
రక్తం రుచిచూసిన మట్టి
పత్రికా నేత్రాలు
ప్రజా కలాలు
బోనెక్కి ఓడిపోతాయి.
అమావాస్యే కాదు
పున్నమీ చీకట్లు పరుస్తుంది
హక్కులు ఆకస్మిక మరణాలు.
ఒక రాజ్యం ఏం చెయ్యగలదు
ఎన్‌కౌంటర్ చెయ్యగలదు
అసత్యమాడగలదు
సర్వం అబద్ధమైనప్పుడు
సంస్కరించవలసింది నిజాన్ని.

ఒక మనిషి ఏం చెయ్యగలడు
ఉద్యమించగలడు
ఉరిని తెంచగలడు
ఎన్నటికి ధ్వంసం కానిది మనసు.
కళ్ళన్నీ కాటరాక్ట్ చూపులు కావు
కొండల్ని తొలుస్తాయి
శక్తులన్నీ అశక్త వ్యక్తులు కావు
హిమాలయాల్ని ఎత్తుతాయి.
ఎన్‌కౌంటర్..... ఎన్‌కౌంటర్
పిరికి ప్రభుత్వాల క్షణకాల
రక్షణకవచం ఎన్‌కౌంటర్.
బూటకపు కాల్పుల్ని నమ్మి నడిచే రాజ్యానికి
నమ్మకం వమ్మయ్యే రోజు రానుంది
నా తల్లికి నేను ఋణగ్రస్తుడ్ని
బొమ్మకు ప్రాణంపోసి
పచ్చని నేలపై జీవం చేస్తూ
నేను తయారు నా దేశానికి
నా దేశ తయారీ నేను.

# అమ్మతనం

ఉదర భోషాణంలో బిడ్డను దాచి
కొండ కోనల్లో తిరుగాడుతుంది కంగారు
పొట్ట అయస్కాంతానికి బిడ్డను కరిపించి
కొమ్మారెమ్మన వూగుతుంది వానరం
చంకరెక్క ఉయ్యాల్లో బిడ్డను వేసి
భూగోళం చుట్టుతుంది నరజాతి
జాతులు వేరైనా తల్లిపాత్ర మాది —
నా వృద్ధాప్యపు కనురెప్పలు
కనుగుడ్లపై కూలబడ్డాయి —
రాని నీ రాక కోసం
చికిలింతల కళ్ళ చూపులు
పొలిమేరలు పంటపొలాలు దాటి
కాయలై ఎదురుచూపు
అదెప్పుడూ ఎండమావి.
నీరసించిన కాళ్ళకు సత్తువ యిచ్చి శరీరం
రాయని నీ కబురుకు
ఇంటికి పోస్టాఫీసుకు
లెక్కకు మించి నడకలు చేయిస్తుంది

నటించే నిద్రకు మెలకువ వుండదు.
నిస్సత్తువ మునివేళ్ళకు
చేతులు ఉత్సాహపు వూపిరి నింపగా
లేని నూకల్ని చెరుగుతూ వేళ్ళు
చేటలో నిరాశగా కూలబడ్డాయి
తల్లడిల్లిన చేట వొళ్ళంతా తడి
ఆకలికి ఓదార్పు ఒక తీర్పు.
ఆకలి దినవడ్డీ
దారిద్ర్యం చక్రవడ్డీ
తల్లిని చూడని బిడ్డతనం నీది
పేగు పంచిన అమ్మతనం నాది
మట్టిని మరిచిన కుండ
చెట్టును విస్మరించిన కాయకు
నువ్వు నిండు ఉదాహరణ.

# బారులు కట్టిన స్వాగతాలు

మనుషులు అర్థం అవుతూనే వున్నారు
మారిన నవ్వు గులాబి పూస్తుంది
మాట సంపెంగ రాలుస్తుంది
మాయ జలతారు మరిపిస్తుంది
మారని మనసుది
వేలవేల అభినయాలు
మంచుబొమ్మను.....
కరుగుతాను ఘనీభవిస్తాను
సంకోచ వ్యాకోచాలకు స్పందిస్తాను.
మరబొమ్మను.....
పుట్టుతాను గిట్టుతాను
మట్టినై బొమ్మనౌతాను.
ఎన్ని దార్లు పరిచాను
ఎన్ని హిమాలయాలు మోసాను
మాటేసి దార్లు హతమార్చాయి
మోసిన తలలు సమాధులయ్యాయి.
ఉదయాన్ని నేను సాయంత్రాన్ని నేను
పగలు నేను రాత్రి నేను —

అన్ని రోజులు మరిచాను
అన్ని సంవత్సరాలు గడిపాను
వందమంది వేటగాళ్ళు
ఒకడ్ని ఒంటరిచేసి విజేతలౌతారు
వసంతాలు దోచి వెన్నెలలు మింగి
వారసత్వం ఒకడికి అప్పగిస్తారు.
ఎంతెంత చదివినా ఏదేశమేగినా
ఎన్ని భంగిమల అభ్యంగనాలాడినా
గంగా గోదారుల నీటమునిగినా
మాసిన మనసు మకిల వదలదు.
నూరేళ్ళు బతికినా
నిండుమనిషి కాలేనివాడు
నెలకోసారి నిండుచంద్రుడ్ని
చూసైనా నేర్చుకోడు
నాలుగు గోడల మధ్య
రోదనకు స్వస్తి పలికితే
తెరుచుకున్న ద్వారం
వీడ్కోలు చెపుతుంది.

# రెండు ధ్రువాలు

ఆసేతు హిమాచలం
ఉభయ సంధ్యల వ్యవధిలో
అనుసంధిస్తున్న రైళ్ళు.
చంద్రనిప్పుల ఉష్ణతీవ్రతను
శీతలం చేస్తూ
ఒంటినిండా ఏ.సి. గదులు
చలి రక్కసికి శరాఘాతమై
ఉన్నిరగ్గుల అస్త్రాలు
సమయానికి సానుకూలంగా
చల్లని వేడి పానీయాలు
వేడి వేడి వంట వార్పిళ్ళతో
వేళకు వడ్డన ఏర్పాట్లు
ప్రకృతి సోయగాలు
సుఖశయనాలు.
మారిన ఇతివృత్తాల మధ్య
మారని వ్యధాభరిత చిత్రాలు
చేతుల్తో పాటు పిరుదుల్ని
చీపుర్లు చేసిన బాలుడు

రైలు కంపార్టుమెంటును
బెల్జియం అద్దం చేస్తాడు
చెక్కిళ్ళపై చీకట్లు ముసిరిన
కనుగాయ పసిచూపులు
ఆర్ద్రంగా అర్థిస్తాయి.
చిరిగిన రవిక వెనక
ఎండిన పాలిండ్లను
పీలుస్తూ అడ్డాల చంకబిడ్డ —
గొంతెండిన పసివాణ్ణి చూసి
తల్లడిల్లిన ఆమె కళ్ళు
వర్షిస్తూ యాచన —
కాంతులన్నీ చీకట్లయి
నలుదెసలా బిచ్చమెత్తుతూ
గొంతెండి గొంతెత్తిన గుడ్డివాడి పాటకు
శ్రీవేంకటేశ్వరుడు ఉలిక్కిపడి
క్షణకాలం
శ్రీదేవి భూదేవుల మరుస్తాడు.
ఉత్తర దక్షిణ ధ్రువాల్ని
కరచాలనం చేస్తూ రైళ్ళు
అసమానత అపస్వరమై
విశ్వమానవ యానం.

# నాణేనికి రెండు నాల్కలు

నాకు నీవు నీకు నేను
విన్పించదేం సఖ్యతా రాగం?
ఇక్కడ రక్తసంబంధాలు
పసిపాప చేతి మట్టిబొమ్మ.
పాలరాతి ఫ్లోరింగు
వెండిమబ్బు గోడలు
సమశీతల గదిలో
మరణం ముంగిట అతడి నిద్ర.
ఇంటిని ధనసముద్రం చేసిన
ముగ్గురూ అతని ముద్దుబిడ్డలు
ఒకడు డాలర్ ఒకడు పౌండు
ఒకడు దీనార్
విదేశీ ఫోన్లు జీవంపొయ్యటానికి
విఫలయత్నం చేస్తున్నాయి.
అతడు కళ్ళు తెరుస్తాడు
మాటను చూపులో రంగరించి
మౌనమై వెతుకుతాడు
ఆత్మీయతానురాగానికి

అలమటించిన మనసుకు
ప్రేమానురాగల స్పర్శ వుండదు
సానుభూతి పవనం వీచదు
కన్నబిడ్డల నిండుమాట వినపడదు.
మననం ఉద్విగ్నమై
ఒంటరితనం ఎంత దుర్భరమో
అతనికి తెలుసు
అవిశ్రాంతమై మోస్తున్న మంచానికి
అహర్నిశం వీక్షించే గదికి తెలుసు.
మాట దుఃఖంలో మునిగి
కన్నీరై ఉబుకుతుంది
జననీ జన్మభూమి
కేవలం ప్రార్థనాగీతాలు.
అతడు మరణిస్తాడు
సుతిమెత్తని అనుబంధం
మీగడ చిట్లిన చిత్రం
డాలర్ పౌండు దీనార్
ఫోన్లు దుఃఖిస్తాయి
శవం ఒంటరి కాదు
దుప్పటి వెంట వుంది.

# మృగతృష్ణ

అరిగి అలపెరగని కాళ్ళు
కడవెత్తుకుని ఒకటే ప్రదక్షిణ
దాహార్తికి దొరకని గుక్కెడు నీళ్ళు.
కానరాని మంచినీటి కోసం కావడి
మైళ్ళ తరబడి శోధిస్తూ
కాయగట్టిన భుజంపై విన్యాసం.
ఇంట్లో ఎండిన గొంతులు
ఎదురుచూపున వేళ్ళాడుతూ
ప్రాణానికి ప్రాణమైన నీటి కోసం
ఉగ్గబట్టిన పంచప్రాణాలు.
దాహం దాహం తీరని దాహం
పోటెత్తిన సముద్రం
ఒడ్డున ఉనికి చాటుతూంది
నీటికి తాను నిలయమని.
నిక్షిప్త భూగర్భ జలసంపద
ఇంటి ఖజానాగా
నీ సొంతమంటూంది.
రంగు వెలిసి కెంజాయి పెన్నమ్మ

తేట తేట నీలి కృష్ణమ్మ
ఉరుకు పరుగుల నిండు గోదావరి
నింగి పొరల్నుండి దుమికే జలపాతాలు
కొండకోనల్లో వేణువులూదే సెలయేర్లు
నీరు నేర్పని నడక లేదని
సరిగమలు పాడుతూ సాగుతున్నాయి.
దప్పిక దప్పిక ఆరని దప్పిక
మంచినీటికై మనిషి
మజిలీ లేని నడక
మెట్టుపై మెట్టును అందుకునేలోగా
పైమెట్టు విద్రోహచర్య.
పాడిని పాడిగానే వుంచే
తడిగొంతుల ఎత్తుగడ
మంచినీటికి మనిషికి మధ్య
మనిషి మిగిల్చిన మృగతృష్ణ.

# పగిలిన అద్దం

ఆత్మీయత పండువెన్నెలై
మేను మైమరచిన స్వప్నం
సుగంధ మరంద కుసుమం
వాకిట వాలిన స్వప్నం.
శిఖరాగ్రం నుండి సుషుప్తి
భళ్ళున జారిపడిన శబ్దం
విప్పారిన కళ్ళకు
వికృతరూప వర్తమానం.
పూలకుత్తుకల ఉత్తరిస్తూ
ఉన్మాదపు కరవాలం.
గళంలో గరళమైన
అనురాగపు పలుకు.
పేగు తెంచుకు పుట్టిన బిడ్డ
తల్లి పాలిటి యమపాశం.
ఒక ఒరలో ఇమడని
ఒక తల్లి బిడ్డల వైరం.
ద్వేష విద్వేషాల రక్తపుటేరుల్లో
కుప్పకూలిన అనుబంధం.

ఈర్ష్య అసూయల కబంధహస్తాల్లో
చితికిన సంబంధ బాంధవ్యం.
భవిష్యత్తు భయానకమై
వర్తమాన చిత్రపటం.
ఇదిగో ఇంటింటికీ
దీక్షాకంకణమై
వేలాడదీసిన అనుశాసనం.
మమతానురాగ
చేతనా గేయం
మానవ కళ్యాణానికి
సమైక్యతా హారం.

# కోటిగొంతుల రాగం

మాన్య మిత్రులారా క్షమించాలి
కాలక్షేపానికి కవిత అనుకోవద్దు
కర్మ బడిలో కష్టాలు దాచి
నొసటిరాతల్ని నేలపై గీసుకుంటూ
తలొంచి తరలిపోతున్న జనావళిని
ఒకే తాటిపై ఉద్యమించమని
కవితలు నాటుతాను.
ఉక్కుపాదమో తుపాకీ మడమో
నన్ను మూగను చేస్తుంది
బందిగమో బానిసత్వమో
శరీరాన్ని కట్టడి చేస్తుంది
మరుక్షణం మనసు మనిపై విజృంభణ.
నీటి ఒడ్డున నిల్చి పాడుతాను
అలలు తోసుకుంటూ
అంచుకొచ్చి ఆలకిస్తాయి
ప్రతిధ్వనించిన గాలి
పాట పాడుతుంది
చుట్టూ సమూహం కోరస్ కలుపుతుంది.

మాన్య మిత్రులారా క్షమించాలి
కాలహరణకు కవిత అనుకోవద్దు
కన్న కలలకు రూపకల్పన కవిత.
రోజులు వెళ్ళదీస్తూ
మరణానికి జమకట్టి
అయిపోయింది జీవితం అనుకోవద్దు.
కథ ఒకేరీతిలో ముగియదు
కవిత ఒకే మూసలో నడవదు
ఆకాశంలో అక్షరం విత్తితే
భూమిపై పండుతుంది
కవిత కోటిగొంతుకల్ని
తోరణంగా మలిచే మార్గం
కోటివీణల్ని ఒకే శ్రుతిలో
పలికించే రాగం.

# మనిషిని మించిన మరోప్రాణి

రోడ్డు ప్రక్క సైనికులై నిల్చిన చెట్ల సముదాయం
మనసు చిన్ననాటి చరిత్ర పాఠాలు మననం చేస్తొంది
రహదారి కిరుప్రక్కల చెట్లు చలివేందరలు
నాటి అశోకుడి మేటి ప్రజాహిత పాలన
సమ్రాట్టుది శతాబ్దాల ముందుచూపు —
చెట్టు ఒక ఆశ్రయ ఆశ్రమం
ఆతిథ్యమిస్తుంది జ్ఞానబోధ చేస్తుంది
ఆకలి తీరుస్తుంది ఆవాసమిస్తుంది
ఆత్మకథలు చెప్తుంది.
రోడ్డు విస్తరణలో కూలిన నేటి వృక్షాల
వయసు వృత్తాంతాల నేపథ్యం తెలియదు
ఊడలు చెబుతాయి వందల సంవత్సరాలని —
కుప్పకూలిన మహావృక్షాల
కాళ్ళు చేతులు మెడ నడుం
ముక్కలై మోపులుగా రూపుదాల్చటం
వేలాడదీసిన వేట
మాంసఖండాలై సంచికి చేరిన చందం.
కూలిన చెట్ల రాలిన ఆకుల కళ్ళు

మనసున్న మనిషిని చిరకాలం వెంటాడే
ఛాయా స్మృతిచిత్రం.
అతివీర పరాక్రమ పవనుడు
ప్రళయ భీకర వరుణుడు
చండ ప్రచండ భానుడు
వటవృక్షాల్తో పోరాడి పరాజయం.
పీల్చిన విషాన్ని ప్రాణవాయువుగా మార్చి
పర్యావరణ సమతౌల్యం చేసి
ఫలపత్రాదుల్తో మానవాళికి
కామధేనువులై మహోన్నత సేవలు
తరతరాలుగా తండ్రి తాత ముత్తాత
అక్కడ సేదతీరిన అడుగుజాడలు.
చెట్టు మనిషిని మించిన మహాప్రాణి
చెట్లు కూల్చబడినా
హంతకులకు క్షమాభిక్ష పెట్టి
మళ్ళీ మళ్ళీ మొలుస్తున్నాయి
యుగయుగాల నేరాలు మాని
మనిషిని మనిషిగా మారమంటున్నాయి.

# నరాసుర సంహారం

సంకెళ్ళు తెగిన తల్లి భారతి వయసు
శతాబ్దాల లెక్కల్లో అర్ధశతాబ్ది.
తూర్పురేఖల్తో మేల్కొన్న అవినీతి
పాయలై ఏరులై సంచితమై ప్రవాహం
రాసులై గుట్టలై కొండలై నివాసం
ఏ దిశ తాకినా అవినీతి చంద్రిక
ఏ గాలి సోకినా దుర్గంధ వీచిక
ఒంటిపై అవినీతి రోమరోమ విభూషితం.
వాలీ వాలని చీకట్లో వాలిన హింస
నిశీథి తిమిరంలో కరాళనృత్య భీతి
కన్ను తెరిచినా మూసినా
కరడుగట్టిన క్రౌర్యం
అత్యాచారానికి బలైన
విరియని మల్లెల ఆక్రందన
మూడు ముళ్ళ సాక్షిగా
ఇల్లాండ్ర మూగవేదన
పెల్లుబికిన దౌర్జన్యానికి
పచ్చపచ్చని బతుకులు బలి

పెచ్చరిల్లిన ద్వేషానికి
నెత్తుటేళ్ళు ఆనవాళ్ళు
నీరు పల్లమెరుగు
అవినీతి మెరకెరుగు.
చట్టం తన పని తాను చేస్తూంది
మైలపడి మనుషుల్ని
తాకకుండానే ప్రశ్నించకుండానే —
ఏది తల్లీ! అసుర శిరచ్ఛేదన ఖడ్గం
హస్తాలంకారమై భాసిల్లుతూనే వుంది
నరాసురులే భక్తాగ్రేసరులై
పరివేష్ఠించిన కొలువులో
ఉదాసీనమై వర్ధిల్లుతున్నావు
ఏది తల్లీ! ప్రళయ భీకర సంహారం?

# అంతులేని కథ

సూర్యుడు బతికిన పదీ పన్నెండు గంటల్లో
చక్కబడని నా ఇంటిముందు కూలబడి
సాయంత్రం విలవిల్లాడిపోతాను —
మొదలైన కథ ముగియదు
వెలిగే మిణుగురు మొగ్గను
ఎవడో వెంటాడి తుంచుతాడు
తెగిన నా రెక్కల్ని ఒకడు అతికించుకు పోగా
చక్కబడ్డవాళ్ళ సాక్షిగా చంద్రుడు నవ్వుతూ
నా ముందు నిల్చి అపహాస్యం చేస్తాడు.
పారే నీటికి అరికాలు అడ్డడం యుద్ధం
బలపం దాటి కలం బట్టడం యుద్ధం
మాటలు నేర్చే పసిబిడ్డ అమ్మా అనడం యుద్ధం
జీవన సమరంలో
అన్ని చిరునామాలు
ఒక దుఃఖాల లాకరు
నెర్రెలిడిన నేలను తడిపేందుకు
నా వాటా నీళ్ళు మృగ్యం
వెతికే కన్నుకు భగీరథుడు శుక్రుడు

ఒక బాటలోనే —
టెలిఫోను తీగపై వొదిగిన పక్షికి
కాళ్ళకింద తీగ అనంత భూమండలం
ఒంటరిగా నన్ను నేను నాటినచోట
నేను నిల్చిన భూమి సహవాసి.
ప్రాతస్సంధ్యను పట్టుకోను
సాయంసంధ్యను వెంటాడాలి
ఉగ్గబట్టిన నా ప్రాణం పురివిప్పింది
మేఘాల చాటున ఇప్పుడు
కలవారి చంద్రుడి ఉరుకులు —

# ఎడారి నిండా నీళ్ళు

ఇక్కడ ఎడారి నిండా నీళ్ళు
ఎక్కడా మొక్క మొలవడం లేదు
అకృత్యాల పట్టిక ఇదిగో.....
ప్రతివాడూ వాడిది కాని నీడను
వెంటేసుకుని నడుస్తూ
శుష్కించిన వొంటి చర్మాలకు
వాసాలై నిల్చిన ఎముకల గూళ్ళు
నగ్న రూపాలన్నీ వస్త్రాపహరణలు కావు
అన్నీ వస్త్రాలు లేనివే.
రోజువారీ విస్ఫోటనాల కొలమానానికి
తాజా యంత్రాల్ని కనుగొనాల్సి వుంది
సంపదల్ని మోసుకుపోయే బాట
సమస్తాన్నీ శాసించే మాట మధ్య
అచేతనాల గుట్టలై పడున్న అక్షరాలు
ఒక పదం.....
ఒక వాక్యం.....
ఒక సందేశం.....
ఒక ఉద్యమంగా మారి

జనపదాలను కూడగడతాయి.
ఒకవైపు పడగెత్తిన సంపద
ఒకవైపు చెయ్యెత్తిన సమూహం మధ్య
దివారాత్రాలు సాగే బాటలో
మిణుగురు శిశువుల్ని మింగుతూ చీకటి.
ఉప్పొంగిన చీకటి మాటున నూతిలో గొంతుకలు
కొండంత చీకట్ని తరుముతూ
గోరంత దీపం.
ఎండిన వత్తి పుష్పిస్తుంది
ఎక్కడ దాగింది ఇంధనం?

# ఎవరి దుఃఖం వారిది కాదు

చిరు అలలు గస్తీ కాస్తుంటే
చెరువు క్షేమంగా నిద్రిస్తుంది
చెరువుకు అలల బిడ్డల రక్షణ
అనుబంధం ఆప్యాయతల సమ్మేళనం.
మూడుకాళ్ళ మజిలీలో
కన్నబిడ్డలు కనుపాపలు కాలేక
ఈసడింపు ఛీత్కారాల వర్షం
ఎవరి దుఃఖం వారిది కాదు
వార్ధక్యం నే కోరి తెచ్చుకుంది కాదు
వృద్ధాప్యం శాపమై
పొద్దంతా అవమానం మోసిన మనసు
ఎడపొద్దులో ఏకాంతం కోరి
పార్కుకు పరుగులు తీస్తుంది.
మొలకెత్తే విత్తు
విరబూచే మొగ్గ
కోకిల గాత్రకచేరి
వంత పాడే భ్రమరాలు
పక్షుల యుగళగీతం

సూర్యుడికి తెరకట్టి
నీడను కురిసే మేఘాలు
అక్కడ హృదయాకాశంలో
అందాల వరదగుడి.
పచ్చికబయళ్ళపై నా మేను
పసిమిగువ్వయి ఎగురుతుంది
వయసు మరిచిన విహారం
ఆకస్మికంగా ఆగి చూస్తుంది.....
పండి రాలిన ఆకును
పూరెమ్మలు తలపై పండబెట్టుకుంటాయి
చిరుగాలి ఉయ్యాలలై వూపుతాయి
కన్నతల్లి పేగుబంధానికి
పూబిడ్డల కృతజ్ఞత అది.
నడుస్తున్న చరిత్రలో నా చిత్రం.....
రక్తబంధ ఋణవిముక్తికై నా సంతతి
అంపశయ్యకు సాగనంపుతూంది
అత్యంత దర్పంగా
అదీ అతి రహస్యంగా —

# ప్రనస్వాగతం

చీకటి వెలుగుల సయ్యాటలో
నేలమాళిగ ఆమె నెలవు
మేఘాల భీషణ ఘోషల మధ్య
ఆకాశం సముద్రమై నేలకూలింది
నేలంతా నీటిపంట.
కిటికీరెక్కలు వణుకుతున్న శబ్దం
తలుపురెక్కలపై ఎవరో తడుతున్న ధ్వని
ఉలిక్కిపడి ఆమె పాదాలు
వాకిట్లోకి నడుస్తాయి
మాటిమాటికి గాలి మనిషై చేస్తున్న గేలి.
చెట్లసందుల్లో దూరిన గాలి
మరణమృదంగాలు వాయిస్తూ ఉరుకులు
మధ్యమధ్య కొమ్మల్లో పట్టుదప్పిన
పక్షుల ప్రాణభీతి కలకలం
పానశాలే అంతఃపురమై
మద్యం మత్తులో ఎక్కడో పడున్న ఆమె భర్త
ఏళ్ళుతరబడి కన్నీటి శేషగాథ
ఏడడుగుల బంధానికి

ఏడు యోజనాల గండి.
నాలుగు గోడల మధ్య స్త్రీ
నాలుగు దిక్కుల మధ్య పురుషుడు
స్త్రీ పురుషుల స్వేచ్ఛ
హస్తిమశకాంతర నిష్పత్తి.
నిషా వదిలి భర్త ఇహలోకవాసై
ఉషోదయాన గృహప్రవేశం
అడుగుమోపిందే ఆలస్యం
అర్ధాంగికి ఆదేశాలు ఆపై ఆగ్రహాలు
అతడు ప్రశ్న ఆమె జవాబు
ఆమె చరణదాసి అతడు ప్రత్యగాత్మ.
వాన వెలిసిన ఉదయాన
వాకిట వాలిన పక్షి స్ఫూర్తై
ఆమె అంతరంగాన రెక్కవిప్పిన చైతన్యం.
లక్ష్మణరేఖ చెరిగిపోయింది
ఎదురొచ్చిన సూర్యుడు స్వాగతిస్తున్నాడు.

# మహోవిష్కరణ

సమాధులపై పల్లవించిన పచ్చదనం
గరికకు అన్ని గోరీలు సమానం
ఆస్తులు అంతస్తులు వర్ణాలు
అన్నీ అక్కడ మట్టిరేణువులు
మట్టికి గడ్డిపూల బహూకరణ.
కదిలిపోయిన కాలానికి కదులుతున్న కాలం
ఇదిగో ఇక్కడ సాక్షీభూతం.

......

ఒక ప్రశ్నకు వినయ వినమ్ర సమాధానం
ఆజ్ఞకు వంచిన శిరస్సు ప్రత్యుత్తరం
కండబలం న్యాయస్థానమై తీర్పు
గూండాగిరీ శిక్షలు అమలు.
దోపిడీ దౌర్జన్యాల విశృంఖలత
కాళ్ళకింద మట్టీ కనుమరుగు
దిగంబరుడు చూస్తున్నాడు
అంబరాలు చెట్టెక్కాయి
అనాచ్ఛాదిత ఆర్తుడి వీపుపై
వాలిన ఎండ ఎండి రాలిపోతుంది.

భూలోక నరకానికి
ఇదిగో ఇక్కడ చరమాంకం.

.....

మార్జాలం మహారాజులా అరుదెంచింది
అల్పజీవి ఎలుకలూ అప్రమత్తం
కలుగుల తలుపులు తెరిచి
పిల్లిమెడకు గంట కట్టకండి
ఐక్యమై సఖ్యమై గంటకొట్టి వెంటాడండి
నిశ్శబ్ద శబ్దానికి బీజం
బీజం విస్ఫోటనానికి ఆరంభం.
తన్ను తాను మరిచిన మానవుడికి
ఇదిగో ఇక్కడ మహావిష్కరణ.

.....

ఎవడి ముఖాన పొద్దుపొడుస్తుందో
ఎవడి చేతులు ఉషోదయాన స్నానిస్తాయో
వాడు సూర్యుడు వాడు భగీరథుడు
వాడి చూపు సిందూరం - ముఖం మందారం
పిడికిలి క్షిపణి - పాదం ఆయుధం.

.....

# అక్షరశిల్పం

వయసుడిగిన వెలుగును గోధూళి
వీధుల్లో ఉల్లిపొర తెరలు కట్టింది
కేరింతల లేగదూడ
చెంగుచెంగున గంతులేసి
తల్లిపొదుగులో మూతిదాచి
కాళ్ళకు బంధం వేయడం
బిడ్డకు గంగడోలు కప్పి
అమ్మ కౌగలించుకోవడం
కవిత్వీకరిస్తున్నాను.
గుక్కపట్టి ఏడ్చిన పసికందు
చనుబాల చప్పరింతలో
పళ్ళు లేని పండువెన్నెల నవ్వు జూసి
వెండిమబ్బు మేనాలో దూదిపింజై
అమ్మమనసు ఊరేగడం
శిల్పీకరిస్తున్నాను.
కొమ్మారెమ్మలు జార్చిన నీటిబొట్లు
కొండలోయల్లో ఎగిసిన బుగ్గలు
పాయలై బండరాళ్ళ గుండెల్ని తడిపి

బీళ్ళపై వసంతాలు చల్లి సాగే
సెలయేటి నడకల గలగలలు
శ్రోతల గుండెల్లో ప్రతిధ్వనించి
వీక్షకుల చూపుల్లో కాన్వాసై
మనసున మల్లెలు కురవడం
చిత్రీకరిస్తున్నాను.
రోడ్డుప్రక్క అనాథ ప్రేతాన్ని
ఒళ్ళంతా తట్టిలేపుతూ
తల్లిది మరణమో మౌనమో
తెలియని మాటనేర్వని పసికూన
ఉవ్వెత్తు ఏడ్పుకు
చుట్టూ ఘనీభవించిన గాలిని
చూస్తూ సాగిపోయే జనాన్ని
అక్షరీకరిస్తున్నాను.
ఇది అక్షరశిల్పం
ఇది స్వరచిత్రం.

# అగ్నిస్నానం

నింగీ నేల నేస్తమై
చీకటి సరళరేఖపై నడుస్తున్నప్పుడు
నల్లబజారు దండయాత్ర
ఎదురులేని అశ్వమేధయాగం.
సాగరమథన స్వార్థం తెలుసు
అమృతం తస్కరించి ఆస్వాదించిన
అమరుల జిత్తులు తెలుసు.
రంగురంగుకు నవ్వు మార్పు
నవ్వుల రంగు ధవళం కాదు
గుండెకు గుబుళ్ళు తెలుసు
మారుతున్న రంగుల్ని లెక్కించటం తెలుసు.
ఆకలి నిండిన నోళ్ళు
ఆలపించిన గీతం పరిధిదాటి
పరిభ్రమించి లోకాన పండుతుంది
గాలి నీరు దొరకని వివక్ష
అంతఃకరణల సంఘర్షణ
అవమానాల కుంభవృష్టి
తరాల అంతరాల మనఃఫలకంపై

శాశ్వతముద్ర చెక్కుతుంది.
వైకుంఠపాళి కేళీహేలలో
పాము మింగినా పారం కొత్తదైతే
చిటికెలో పావు శిఖరాగ్రం చేరుతుంది.
కాలాన్ని కట్టడిచేసిన వాడికి
సముద్రం రహదారై స్వాగతం
అభాగ్యులు
అనాథలు
అన్నార్తులు
అర్భకులు
మనసుకు తడి తగిలితే
మనోనేత్రం తెరుస్తారు
అగ్నిని స్నానిస్తారు.

# అహింసను నెమరేసిన హింస

దేవతలు రానిచోటికి
దెయ్యాలు పరుగెత్తుకొస్తాయి
ప్రేమ పుట్టని చోట
పాషాణం మొలకెత్తుతుంది.
భూమి అడ్డుకోత పటంలో
మైక్రోస్కోపుకందని
శాంతి, అహింసలు —
స్నేహానికి చిహ్నం క్షిపణి
చేయి చేయి కలయిక కాదు.
విశ్వాధిపత్యానికి
అణుబాంబు విస్ఫోటనం
హిరోషిమా హిరోషిమా
నాగసాకీ నాగసాకీ
రుద్రభూమిలో
మొద్దునిద్ర లేవండమ్మా
చుట్టూ కాలి కూలి
అంగవైకల్యాల కొండలు
మండి పగిలిన రాళ్ళు

సహారా థార్ ఎడార్లు
మనిషి మిగలని దేశాల్లో
మట్టి రోదిస్తూంది.
అణుబాంబు సృష్టికర్తలు
పెంచి పోషించిన పెద్దలు
అభం శుభం ఎరుగని జీవరాసి
రేణువులై కొలువుతీరడం చూసి
బుద్ధుడు నవ్వాడు
మళ్ళీ జ్ఞానోదయం కోసం
బోధివృక్షంవైపు పయనం.
విస్ఫోటనం యిచ్చిన
ప్రేతవనాన్ని చూసి
అశోకుడు నవ్వాడు
రాజ్యం త్యజించి
వానప్రస్థుడై సందేశం
శాంతిని జీర్ణించిన అశాంతి
అహింసను నెమరేసిన హింస
రేణువుపై దొర్లుతూ రేణువు.

# పేగు తెగిన గుండె

మనిషి మరణిస్తాడని తెలుసుగాని
మరణమంటే తెలియదు
మరణం దుఃఖమిస్తుందని తెలుసుగాని
దుఃఖమంటే తెలియదు.
రాగాల పల్లకిలో అనురాగాలు ఆలపించి
వసుధపై విజయవిహారం చేస్తూ
అందాల గాలిపటమై
ఆకసాన్ని అలా అలా జయిస్తున్నప్పుడు
హఠాత్తుగా తెగిన నీ రూపు
తిరిగిరాని తీరాలకు తరలిపోయింది.
కన్నబిడ్డ అకాలమరణం
కన్నతండ్రికి జీవన్మరణం
తెగిన దారం పట్టి కొమ్మకొమ్మను
రెమ్మరెమ్మను వేడుకుంటాను
గిరిశిఖరాలను అర్థిస్తాను
పాతాళాలను ప్రార్థిస్తాను
నీ రూపం చూపమని
నీ జాడ చెప్పమని.

నిండు నూరేళ్ళుగా తలచా గాని
అర్థాంతర నిష్క్రమణ అనుకోలేదు
మింగిన ఏడ్పు పొంగుతుంది
పొంగిన ఏడ్పు పొర్లుతుంది
కనుగుడ్లలో కన్నీటి సముద్రాలు.
ఏ మూలకెళ్ళినా నీ అడుగుల చప్పుడు
ఏ శబ్దం విన్నా నీ మాటల సందడి
నవ్వుతూ నావైపు నడుస్తావు
ఆలింగనంలో నీ రూపు అదృశ్యం
రక్తబంధం నాకు మిగిల్చిన
తీపిగుర్తుల రిక్తహస్తం.
నేను శృతితప్పి ఏడుస్తాను
నిశ్శబ్దం ఊరడిస్తుంది
గాలి ఓదార్చుతుంది
కన్ను కునుకు పడదు
మనసు కుదుట పడదు.
ఏనాడు కనపడని నువ్వు
ఏడాదికోనాడైనా
వెండిమబ్బు రథం ఎక్కి
తండ్రిని చూసిపో తండ్రీ.

# స్ఫూర్తి ముద్రికలు

నడిచిన పాదం పరుగిడన పాదం
దూకిన పాదం ఎగిరిన పాదం
సూదిమొన ఆనని చోటుకూ
చొచ్చిన పాదం కదలక మొరాయించింది
ఇన్నాళ్ళూ సాగిన కథ తిరిగి
తొలిమెట్టు వద్ద మజిలీ వేసింది.
నవ్వుతూ నర్తిస్తూ పాడుతూ పరుగిడుతూ
తూర్పు పడమర ఉత్తర దక్షిణ దిక్కుల
అతివృష్టిని అనావృష్టిని
సమవృష్టికి జతకలిపే
యుగయుగాల విరామ మెరుగని
శ్రమైక మేఘమాలికల పాదాలు చూస్తాను
నా పాదాలు స్ఫూర్తిస్తాయి.
విశ్వాన్ని ఉదరంలో పదిలపరచి
గీసిన గీతలో కాలమానమై
కాంతి గణితమై సూర్యుడ్ని కొలుస్తూ
ప్రాదుర్భవించిన లగాయితూ పరిభ్రమించే
స్వేదమయ ధరిత్రి పాదాలు చూస్తాను

నా పాదాలు స్పందిస్తాయి.
ద్వేషాలకూ వర్ణ వర్గ విభేదాలకూ
అతీతమై అభేద్యమై
మట్టి పుట్టిన నాటినుండి
పచ్చదనం పరమావధిగా
మానవాళి మనుగడ మూలవిరాట్టుగా సాగే
నదీనదాల నడకలు చూస్తాను
నా పాదాలు చలిస్తాయి.
భూమిపై చంద్రుడిపై
గ్రహాలపై గ్రహాంతరాలపై
అడుగులు ముద్రిస్తూ
నేను కవిత్వమై శ్వాసిస్తాను
కవిత చిరంజీవి అయినప్పుడు
కాను విగతజీవిని నేను.

# బదులుకు ప్రశ్నేది

పాలరాయి పడతిగా మారింది
మహాశిల్పి వేళ్ళు
రూపుకు తుదిమెరుగులు దిద్దాయి
పెళ్ళిచూపులకు పడతి
పద్మాసనం వేసింది.
విరిసీ విరియని మల్లెలు
బొగడ బేసర వన్నెచిన్నె చూసి
నాగరం నవ్వుకుంది
మధ్య మధ్య అందెల సవ్వడి
వంచిన తల కంటిసిగ్గును కప్పితే
ఒంటి సిగ్గు పట్టుచీరలో వొదిగింది.
అందం సౌందర్యం
లాలిత్యం సౌకుమార్యం
ఆమె సొత్తయి వొదిగాయి
పెళ్ళిచూపుల సూటిప్రశ్నలకు
పడతి మందస్మిత ప్రత్యుత్తరం.
సంగీతానికి భాష్యం చెబుతూ
అన్నమయ్య కృతి అందుకుంది

సరిగమల్ని స్పృశించిన వీణ
వీనులవిందై రవళించింది.
ప్రశ్నలు నిండుకున్నాయి
పెళ్ళికుమారుడి హృది
బృందావన విహారం
పెళ్ళిబృందం మది
ముక్తగగనవాహ్యాళి.
మెల్లగా సుతిమెత్తగా
కట్నకానుకల ప్రస్తావన
పాలరాతి పడతి
మనోహర రూప లావణ్యం
రౌద్రాకారం దాల్చింది
భద్రకాళిగా మారింది.
మహాశిల్పి వేళ్ళు
చండికను చెక్కాయి
అక్కడ జవాబు వుంది
ప్రశ్నించడానికి జనం లేరు.

# చాకిరీ పర్వం

ఆకాశాన్ని పందిరి చెయ్యటం
మేఘానికే కాదు
మనిషికీ సుసాధ్యం.
అశ్వారూఢుడై ఊరేగుతున్న అతడు
యువరాజు కాదు
తలనిండా పూదండ
మెడనిండా స్వర్ణమాల
వడ్డాణం వంకీలు ధరించిన ఆమె
యువరాణి కాదు
స్వర్గాన్ని మరిపిస్తూ
భూలోకపు పెళ్ళిసందడి
సరిగమలు లేని సంగీతం
శాస్త్రబద్ధం కాని నాట్యం
గతి తప్పిన పదవిన్యాసం.
వాహకుల తలలపై
బారులుతీరిన పెట్రొమాక్స్ లైట్లు
మధ్యందిన మార్తాండులై వెలుగులు.
ఓ సూరీడ్ని నెత్తికెత్తుకున్న

ఒకానొక తల్లి ఒళ్ళో
ఒళ్ళారని పసికందు
ఆదమరిచి ఆకలి కౌగిట్లో నిద్ర.
ఆకలి తెచ్చిన నీరసం
అప్పుడప్పుడూ తల్లిని క్షణకాలం
ఏమరిపాటుకు జార్చినా
ప్రమాదం గుర్తించిన తల్లి
తృటిలో అప్రమత్తౌతుంది
సోలి స్పృహతప్పినా
ఆమె నెత్తిపై సూరీడు పదిలం.
ఆకలి భయం చెపుతుంది
భయం భద్రత చూపుతుంది
భద్రత జాగృతి నేర్పుతుంది.
చలువరాతి నిర్మాణానికి
శ్రమజీవుల ఆహుతి
కలవారి ఆనందహేలకు
బడుగు బతుకుల హారతి.
వరుసగట్టి ఉగాదులు
ఏటేటా ఊరేగుతున్నా
లేమి నొసట ఉషస్సు
ఇంకా ఉదయించలేదు.

# చిత్రించని కేన్వాసు

ఆకాశంలో కవాతు మానేసి
బ్యారెక్సుల్లో మేఘాల గాఢనిద్ర
దూరపుకొండల నునుపుమాటున
పారాడే బాలభాస్కరుడు
అంతా సజావుగా వుంది.
పైరుకు తలదువ్వే గాలి పరుగెత్తడాలు
నీటిముత్యాల అంగడి పెట్టిన తామరాకులు
తుషారం కిరీటాలైన గరికపోచలు
మధ్యమధ్య నీటిపై చేపపిల్లల
మెరుపు విన్యాసాలు
నీలిరంగు నింగి
ఆకుపచ్చ నేల
అంతా సస్యశ్యామలంగా వుంది.
చద్దన్నం మోస్తూ గడ్డిపూలకు
పాదం తగలని పడతుల నడకలు
చందమామ చంద్రకాంత నవ్వులు
అందం ఆరబోస్తూ ఆదిత్యుని ముందు పంకజాలు
అంతా సజీవంగా వుంది.

కీటకాల్ని మాటువేసిన పక్షులు
చంక దిగిన పసిబిడ్డల తప్పటడుగులు
గట్లపై జారిపడ్డ పాలనడక పరుగులు
మధ్యమధ్య మంచెపై పేల్తున్న కేకల బాంబులు
అంతా జీవధారగా వుంది.
నీటిఅద్దంలో కంపిస్తున్న నీడను
ప్రశ్నిస్తూ నిశ్చలంగా నిల్చిన చెట్లు
ఓ రంగయో పూలరంగయో సంధ్యారాగాలు
ఎంకి నాయుడుబావ వలపుగీతాలు
మధ్యమధ్య గాలి గుండె ఊసులు
అంతా సచిత్రంగా వుంది.
సమతూకం కోల్పోయి
గతితప్పిన ఒకరోజు —
హద్దుదాటిన సముద్రం
నేలపై అక్రమ ఆక్రమణ
ఫలితం
సముద్రానికి నేల అనుబంధ సముద్రం
కన్నీళ్ళు ఉప్పునీళ్ళు కలగలిసినచోట
వ్యథ చిత్రించని కేన్వాసు.

# వేల సూరీళ్ళ ఉషోదయం

స్వాగతాలు ఉపన్యాసాలు వద్దు
సుప్రభాతాలు వేడుకోళ్ళు వద్దు
సూర్యుడు వచ్చేస్తాడు.
అట్టహాసం ఆర్భాటం వుండదు
రెండు మంచుబిందువులు కలిసినంత నిశ్శబ్దంగా
కనురెప్పలు కదలాడినంత సహజంగా
నూతన సహస్రాబ్దికి కాన్కగా
ఒకరోజును యిచ్చేస్తాడు.
క్రీస్తు పూర్వం క్రీస్తు తర్వాత
శతాబ్దాల తరబడి రోజులు యిస్తూ
శకాన్ని కదిలిస్తూనే వున్నాడు
ఆయన పుట్టడానికి ఒక నిముషం
ఆలస్యం చేసింది లేదు
మరణానికి ముందు ఒక నిముషం
ఆయువు పెంచుకుంది లేదు.
గిరులు తరులు ఎదురొడ్డినా
తూర్పుతల్లి సముద్రంలో మునిగినా
ఆయన వచ్చేస్తాడు

భూగోళం విలపించి అర్థించినా
ఆయన వెళ్ళిపోతాడు.
బడా పెట్టుబడుల బహుళజాతి సంస్థలు
వేడుకలు చేస్తున్నాయి
ఎదురేగి ఆహ్వానాలు పలుకుతున్నాయి
సంవత్సరం సొంతం చేసుకుందామని
వ్యాపార లబ్ధి పొందాలని.
ఇప్పుడు అడుగుజాడలు మార్గదర్శకాలు వద్దు
ప్రబోధాలు సందేశాలు వద్దు
ఇన్నాళ్ళూ అరిగిన పేదవాడి
అరచేతులు చినుగులు పట్టాయి
అందరూ ఐక్యమై ఆలింగనమై
తలలు వంచక చేతులు దించక
ఒకరొకరు పూడ్చుకోక
పుటం పెట్టుకోక
కులం మరిచి మతం మరిచి
కదంతొక్కి పదం పాడి సాగితే
వేల సూరీళ్ళ ఉషోదయం ఎదురౌతుంది.
ధ్యేయం మరిచి దారులు చీలిన చోట
సంవత్సరం జారిపోతుంది
వెరసి సహస్రాబ్ది
అర్థాంతరంగా ఒక ఆకు రాలుస్తుంది.

కృతజ్ఞతలు

రావెల సాంబశివరావుగారికి
నూశెట్టి రామమోహనరావుగారికి
నాగార్జున విశ్వవిద్యాలయం మిత్రులకు
ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, ఆంధ్రభూమి
ప్రజాశక్తి, విశాలాంధ్ర, ప్రజాసాహితి సంపాదకులకు

— అడిగోపుల వెంకటరత్నమ్.